# గార్గేయం

26 ఫిబ్రవరి 2017

## కంకణ సూర్యగ్రహణ ప్రభావముచే ద్వాదశ రాశులకు ఫలితాలు







# గార్గేయం

**26 ఫిబ్రవరి 2017**

## కంకణ సూర్యగ్రహణ ప్రభావంచే
## ద్వాదశ రాశులకు ఫలితాలు





1వ పేజీ

# గార్గేయం



## 1 మార్చి 2017 రాత్రికి ఖగోళంలో అద్భుతం

2017 మార్చి 1 బుధవారం రాత్రి ఆకాశంలో పడమటి దిక్కులో శుక్రుడు, చంద్రుడు, కుజుడు రేవతి నక్షత్రంలో, ఈ మూడు గ్రహాలు ముక్కోణాకారంలో దర్శనమివ్వనున్నవి.

శుక్రుడు విశేషమైన తేజోకాంతితో ప్రకాశిస్తుండగా, ప్రక్కనే చవితి నాటి చంద్రుడు ఉంటాడు. ఈ రెండు గ్రహాలకి పై భాగానగా అరుణ వర్ణంతో స్వల్పంగా మినుకు మినుకుమంటూ కుజగ్రహం కూడా దర్శనం ఇవ్వనుంది. సాధారణకన్నులతో వీక్షించినప్పుడు చంద్రుడు, శుక్రుడు మాత్రం ప్రస్ఫుటంగా కనపడతారు. అతికష్టంతో కుజ గ్రహాన్ని వీక్షించవచ్చు.

26 ఫిబ్రవరి 2017 శ్రీ దుర్ముఖి మాఘ అమావాస్య ఆదివారం రాహు నక్షత్రమైన శతభిషంలో ఓ కంకణ సూర్యగ్రహణం జరుగును. ఇది భారతదేశంలో కనపడదు. గ్రహణం జరిగిన 72 గంటల తదుపరి మార్చి 1న మహాసౌరయోగంలో ఈ గ్రహాలదర్శనం మహావిశేషం. ఏ నక్షత్రంలో జన్మించిన వారైననూ, ఎటువంటి కార్యక్రమాన్ని ప్రారంభం చేయాలన్నా మహా సౌరయోగం విశేషంగా యోగిస్తుంది.

మార్చి 2వతేది సర్వార్థసిద్ధియోగం రావటం విశేషం. ఈ రెండు యోగాల మధ్యలో బుద్ధి కారకుడైన బుధుని వారమైన బుధవారం నాడు, బుధనక్షత్రమైన రేవతిలో ఈ దర్శనం ఉండటం మహావిశేషం.

(మరిన్ని వివరాలు తదుపరి పోస్టింగ్‌లో)

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ

## కనిపించే సమయాలు

| | | |
|---|---|---|
| హైదరాబాద్ | : | సా.6.19 నుంచి రా.9.04 వరకు |
| విజయవాడ | : | సా.6.10 నుంచి రా.8.55 వరకు |
| తిరుపతి | : | సా.6.17 నుంచి రా.8.59 వరకు |
| విశాఖపట్నం | : | సా.5.59 నుంచి రా.8.44 వరకు |
| చెన్నై | : | సా.6.14 నుంచి రా.8.55 వరకు |
| బెంగుళూరు | : | సా.6.25 నుంచి రా.9.06 వరకు |
| షిర్డీ | : | సా.6.33 నుంచి రా.9.21 వరకు |
| ఢిల్లీ | : | సా.6.17 నుంచి రా.9.13 వరకు |



2వ పేజీ

# గార్గేయం



## 1 మార్చి 2017 రాత్రికి ఖగోళంలో అద్భుతం

2017 మార్చి 1 బుధవారం రాత్రి ఆకాశంలో పడమటి దిక్కులో శుక్రుడు, చంద్రుడు, కుజుడు రేవతి నక్షత్రంలో,ఈ మూడు గ్రహాలు ముక్కోణాకారంలో దర్శనమివ్వనున్నవి. ఈ గ్రహకూటమికి 72 గంటల ముందుగా కుంభరాశిలో కంకణ సూర్యగ్రహణం జరుగనున్నది. గత 2016లో గురు,రాహు నాగబంధన సమయంలో అనగా 1 సెప్టెంబరు 2016న సింహరాశిలో సూర్యగ్రహానికి కంకణ గ్రహణం ఏర్పడింది. ఆ గ్రహణం ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై వ్యతిరేక ప్రభావంతో పాటు పలు భూకంపాలు, విమాన ప్రమాదాలకు దారి తీసింది. అలాగే 2017 మార్చి 1 రాత్రికి ఖగోళంలో కనపించే అద్భుత గ్రహస్థితికి ముందుగా మరో సంపూర్ణ కంకణ గ్రహణం కుంభరాశిలో ఏర్పడనుంది.

దీని ప్రభావం ఏయే అంశాలపై ఉంటుందో క్లుప్తంగా తెలుసుకోవటానికి ప్రయత్నం చేద్దాం. ఈ ఫిబ్రవరి 26నాటి గ్రహణ ప్రభావం ఆఫ్రికా, అంటార్కిటికా, ఉత్తర దక్షిణ అమెరికా ఖండాలపై అధికంగాను, ఇతర ఖండాలపై పాక్షికంగాను ప్రభావముండును. ముఖ్యంగా ఆర్థిక రాజకీయ సామాజిక వైమానిక, ఉగ్రవాద అంశాలపైనా, పాకృతిక స్థితులపైనా (భూకంపాలు, తుఫానులు, సునామీలు, ప్రచండగాలులు) ఉండును. ఈ గ్రహణ ప్రభావం మంగళయాన్ పైన ఉంటుందనే ఉద్దేశ్యంతోనే, మంగళయాన్ కక్ష్యను మార్చటం కూడా జరిగింది. ఈ గ్రహణ ప్రభావం 4మాసాల వరకు ఉంటుంది. విశేషమేమిటంటే ఈ గ్రహణం జరిగిన 72 గంటలలోనే బుధగ్రహ వారము మరియు నక్షత్రంలో అంగారక శుక్ర శంశాకుల కలయిక జరిగింది. (కుజ శుక్ర, చంద్రులు). ఈ కలయిక తదుపరి 72 గంటలకు శుక్రుడు వక్రంలోకి వెళ్లటము, ఆ తదుపరి అస్తమించి శుక్రమౌఢ్యమి రావటము జరుగుచున్నది. ముఖ్యంగా ఈ గ్రహస్థితి 2 యోగాల (మహాసౌరయోగము, సర్వార్థసిద్ధి యోగము) మధ్యలో వచ్చింది. చవితి తిథి చంద్రదేవతయైన భేరుండా దేవతను మార్చి 1న మనసులో భావన చేసుకుంటూ శ్రీ లలితా పరమేశ్వరిని మానసికంగా విశ్వాసంతో, భక్తితో ఆరాధించండి.

అయితే ద్వాదశ రాశుల వారు కొన్ని కొన్ని అంశాలలో జాగ్రత్తలు తీసుకుంటూ ఉంటుండాలి. జాగ్రత్తలు అంటే ఏమిటి అనుకోవచ్చు. ప్రతి విషయంలో హడావుడిగా నిర్ణయాలు తీసుకొనకుండా, ఆచితూచి అడుగులు వేస్తూ, సరియైన బుద్ధి కుశలంతో నిర్దిష్ట అంశాలపై దృష్టి ఉంచటమే.కనుక మేష రాశి మొదలుకొని మీనరాశి వరకు ఉన్న 12 రాశుల వారు ఎప్పటినుంచి ఎప్పటివరకు ఏయే జాగ్రత్తలు ఏయే నిర్దిష్ట అంశాలపై తీసుకొనవలసి ఉండునో తదుపరి పేజీలలో తెలుసుకోవటానికి ప్రయత్నం చేద్దాం. భయము, ఆందోళన చెందాల్సిన అవసరం లేనే లేదు. ప్రతి తాళము, చెవి (కీ) లేకుండా తయారు కాదు. అలాగే పతి సమస్యకు ఒక పరిష్కారం భగవంతుడు ఏర్పాటు చేసి ఉంటాడు. సహనంతో ఉన్నప్పుడే సమస్యలకు పరిష్కారాలు దొరుకుతాయి. తొందరపడకూడదు, ధైర్యంతోనే మనముండాలి.

(మరిన్ని వివరాలు తదుపరి పోస్టింగ్‌లో)

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ

### కనిపించే సమయాలు

| | | |
|---|---|---|
| హైదరాబాద్ | : | సా.6.19 నుంచి రా.9.04 వరకు |
| విజయవాడ | : | సా.6.10 నుంచి రా.8.55 వరకు |
| తిరుపతి | : | సా.6.17 నుంచి రా.8.59 వరకు |
| విశాఖపట్నం | : | సా.5.59 నుంచి రా.8.44 వరకు |
| చెన్నై | : | సా.6.14 నుంచి రా.8.55 వరకు |
| బెంగుళూరు | : | సా.6.25 నుంచి రా.9.06 వరకు |
| షిర్డీ | : | సా.6.33 నుంచి రా.9.21 వరకు |
| ఢిల్లీ | : | సా.6.17 నుంచి రా.9.13 వరకు |



# గార్గేయం



## మేషరాశి ( అశ్వని భరణి కృత్తిక 1 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో మేషరాశి వారు ముఖ్యంగా సంతాన విషయాలపైన శ్రద్ధ అధికంగా చూపాలి. సంతానంలో చిన్నారులైనా, విద్యార్థినీ విద్యార్థులైనా, వివాహమైనవారైనా, కానివారైనా జాగ్రత్తలు తీసుకుంటూ ఉండాలి. విద్యార్థినీ విద్యార్థులైతే వారి విద్యావిషయాలమీద ఓ సరియైన అవగాహనతో ఉంటుండాలి.వివాహం కానివారైనచో వివాహం చేయాలనే సంకల్పం ఉంటే ఆయా అంశాలపైన తొందరపడి నిర్ణయాలు చేయకూడదు. అవగాహనతోనే నిర్ణయాలు చేయాలి. వివాహమైనవారైనచో...వారి స్థితి గతులు ఎలా ఉన్నాయి, దాంపత్య జీవితం ఎలా ఉన్నది అనే అంశాలపైన పూర్తి అవగాహనతో మేషరాశి తల్లితండ్రులు ఉండాలి. పరోక్షంగా చెప్పాలంటే ఈ రాశిజాతకులు ఒక అంశాన్ని పాజిటివ్‌గా ఉన్నది అని అనుకుంటే, ఊహించినదానికంటే భిన్నంగా మరియు వ్యతిరేకంగా పరిస్థితులు రావటం కాని, వాయిదాలు పడటం కానీ, రద్దు కావటం గానీ... ఈవిధంగా అనుకోని తెలియని అస్థిరతలు రాగల సూచన కలదు. కనుక సంతాన ఆరోగ్య అంశాలపైన శ్రద్ధ వహిస్తూ వైద్య నిర్ణయాలకి ప్రాధాన్యత ఇస్తూ వారి వారి జీవన స్థితిగతులలో అంతర్గతంగా ఉన్న సమస్యలను తెలుసుకొని పరిష్కరించాల్సిన అవసరం ఉంది. వారు ఉద్యోగస్తులైనా, వ్యాపారస్థులైననూ తల్లితండ్రులు పూర్తిస్థాయిలో సంతానం నుంచి సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉండటం ఎంతైనా శ్రేయోదాయకం. ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి కనపడే చంద్ర శుక్ర కుజులను మనః స్ఫూర్తిగా వీక్షించి లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింది తేదీలలో సంతాన సంబంధిత అన్నీ అంశాలలో జాగ్రత్తతో కూడిన విచారణ, పరిశీలన, అవగాహన అవసరమని గుర్తించండి.

2017 మార్చి 17 రాత్రి 8.38 నుంచి 20 ఉదయం 9గం॥10ని॥ల వరకు, ఏప్రిల్ 14 ఉదయం 4గం॥06ని॥ల నుంచి 16 సాయంత్రం 4గం॥39ని॥ల వరకు, మే 11 ఉదయం 10గం॥38ని॥ల నుంచి 13 రాత్రి 11గం॥11ని॥ల వరకు చివరగా జూన్ 7 సాయంత్రం 4గం॥36ని॥ల నుంచి 10 ఉదయం 5గం॥12ని॥ల వరకు సంతాన అంశాలపై దృష్టి నిలపండి. కంకణ గ్రహణ సందర్భంగా సంతాన అంశాలపై సానుకూల ఫలితాలను పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ పరిహారమును గమనించి పాటించటానికి ప్రయత్నం చేయండి. (ఇది 3వ పేజీ)




4వ పేజీలో వృషభరాశి వారికి జాగ్రత్తలు



# గార్గేయం



## వృషభరాశి ( కృత్తిక 2,3,4 రోహిణి , మృగశిర 1,2 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు.కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచవ్యాప్తంగా నాల్గుమాసాల పాటు ఉంటుంది. ఈ నేపధ్యంలో వృషభరాశి వారు ఉద్యోగ, వ్యాపార, ఆరోగ్య,వాహన, గృహ తల్లి విషయాలలో గతం కంటే అధికంగా జాగ్రత్తలనేవి మంచి నిర్ణయాల రూపంలో ఉండాలి. ప్రస్తుతం ఉద్యోగం చేసే వారు ఉన్నత అధికారులతోను, సాటి ఉద్యోగులతోను జాగ్రత్తగా మెలగాలి. ప్రస్తుతం చేసే ఉద్యోగం కంటే మరో ప్రైవేట్ ఉద్యోగంలో అధికంగా జీతం వస్తుందనే గంపెడు ఆశతో ప్రస్తుతం ఉన్నదానిని హడావుడిగా కాలదన్నవద్దు. అలాగే వ్యాపారాలు చేసేవారు... తమ వ్యాపారంలో తమకు తెలియకుండానే కొన్ని లోపాలు ఉన్నాయని గ్రహించలేరు. కనుక గ్రహించాలి. ఇక ఆరోగ్య విషయంలో లోపములేవీ పైకి కనపడకపోయినప్పటికీ, సమయానికి భోజనం చేస్తూ నిద్రపోతూ ఆరోగ్య నియమాలను పాటించాలి. అవసరమైతే నమ్మకమైన వైద్యుని యొక్క సలహాలు స్వీకరించాలి. ప్రస్తుతం వాహనం కొనాలనుకునే వారు ఈ నాల్గు మాసాలు ఓపికపట్టండి ఒకవేళ వాహనం ఉన్నవారైతే మరమ్మత్తులేమైనా ఉన్నాయేమో తెలుసుకొనే నడపండి. దిక్కులు చూసి నడిపే డ్రైవర్లను జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి హడావుడి నిర్ణయాలతో ఇల్లు కొనకండి. మాతృమూర్తి నిర్ణయాలతో విభేదించవద్దు. వారి ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అధికంగా చూపుటకై ప్రయత్నించండి. ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి కనపడే చంద్ర, శుక్ర, కుజులను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీలలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింది తేదీలలో ఉద్యోగ, వ్యాపార, ఆరోగ్య, గృహ, వాహన అంశాలన్నింటి లోను జాగ్రత్తతో కూడిన విచారణ, పరిశీలన, అవగాహన అవసరమని గుర్తించండి.

2017 మార్చి 17 రాత్రి 8.38 నుంచి 20 ఉదయం 9.10 వరకు, ఏప్రిల్ 16 సాయంత్రం 4.39 నుంచి 19 ఉదయం 4గం॥43ని॥ల వరకు, మే 13 రాత్రి 11.13 నుంచి 16 మధ్యాహ్నం 11.34 వరకు చివరగా జూన్ 10 ఉదయం 5.12 నుంచి 12 సాయంత్రం 5.28 వరకు ఉద్యోగ, ఆరోగ్య, వాహన, గృహ అంశాలతో పాటు ఆరోగ్య విషయంపై కూడా దృష్టి నిలపండి. కంకణ గ్రహణ సందర్భంగా ఈ చెప్పిన అంశాలపై సానుకూల ఫలితాలను పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ పరిహారమును గమనించి పాటించటానికి ప్రయత్నం చేయండి. (ఇది 4వ పేజీ)




5వ పేజీలో
మిధునరాశి వారికి
జాగ్రత్తలు



# గార్గేయం



## మిధునరాశి (మృగశిర 3,4, ఆరుద్ర 1,2,3,4 పునర్వసు 1,2,3 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపధ్యంలో మిధునరాశి వారు ముఖ్యంగా సోదర, సోదరీ అంశాలపైన అధిక శ్రద్ధ చూపించాలి. అన్నదమ్ములు, అక్కచెల్లెల్లు చిన్నవారైనా, పెద్దవారైనా, వృద్ధులైనా ఓ సరియైన అవగాహనతో ఉంటూ శతృత్వాలు లేకుండా ఉండటం చాలా అవసరం. ఆర్ధిక మరియు పిత్ర సంబంధ అంశాలలో విబేధాలు రానీయ కుండా చర్చించుకోవటం ఎంతైనా మంచిది. భుజాలు, ముంజేతులు, శ్వాసనాళాలు,చెవి సంబంధిత విషయాలలో సమస్యలు తలెత్తినచో తక్షణం వైద్య నిర్ణయాలు తీసుకొనటం ఉత్తమం. దంపతులు ఉంటే స్త్రీ ఐనా, పురుషుడైనా వారి మామగారి అంశాలపై అధిక దృష్టి కూడా ఉంచాలి. సోదరులలో కనిష్ఠ సోదరీ సోదరులు, దాయాదులు, ఇరుగుపొరుగు వారితో కూడా తగు తగు విషయాలలో జాగ్రత్తలు అవసరమని మిధునరాశి వారు గమనించాలి. ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి కనపడే చంద్ర, శుక్ర, కుజులను మనస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింది తేదీలలో సోదర, సోదరీ, దాయాదులు, ఇరుగు పొరుగులు మరియు ఆరోగ్య అంశాలలో జాగ్రత్తలతో కూడిన విచారణ,పరిశీలన,అవగాహన అవసరమని గుర్తుంచుకోవాలి.

2017 మార్చి 22 రాత్రి 8.32 నుంచి 25 సూర్యోదయం పూర్వం 4.52 వరకు,

ఏప్రిల్ 19 ఉదయం 4.43 నుంచి 21 మధ్యాహ్నం 2.13 వరకు,

జూన్ 16 మధ్యాహ్నం 11.34 నుంచి 18 రాత్రి 10.07 వరకు,

జూన్ 12 సాయంత్రం 5.28 నుంచి 15 ఉదయం 4.24 వరకు ఉన్న సమయాలన్నింటినీ జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. ఈ సమయాలలో తొందరపాటు నిర్ణయాలు ఉండరాదు. కొన్ని కుటుంబాలలో సోదరుల మధ్య న్యాయ పోరాటాలు చేసే వారుంటే ఈ సమయంలో తీసుకునే నిర్ణయాలు సముచితంగా ఉండాలని తెలుసుకోవాలి. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా పైన చెప్పిన అంశాలపై మరింత సానుకూల అంశాలను పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయండి.




6వ పేజీలో

కర్కాటకరాశి వారికి

జాగ్రత్తలు



# గార్గేయం



## కర్కాటకరాశి

(పునర్వసు 4, పుష్యమి 1,2,3,4 ఆశ్లేష 1,2,3,4 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచవ్యాప్తంగా నాల్గుమాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో కర్కాటకరాశి వారు ముఖము, ముక్కు, కండ్లు, నోరు, దంతములు, వాక్‌శక్తి మొదలగు అంశములలో అధికంగా జాగ్రత్తలు తీసుకుంటూ ఉండాలి. అలాగే భోజన సౌఖ్యము, కుటుంబములో శాంతి సౌఖ్యములు, కుటుంబ సభ్యులు, ఇంటిముందు ఉన్నటువంటి స్థలము మొదలైన విషయాలలో కూడా ఏమైనా తెలియని సమస్యలు ఉన్నచో వాటిని కట్టుదిట్టం చేసుకొనాలి. అదే విధంగా మేనమామ విషయంలో కూడా మిత్ర, శతృత్వములు గమనించి మసలుకోవాలి. అసత్యవాక్కులను అదుపులో ఉంచుకోవాలి. ఒక్కోసారి హాస్యవచనములు పలికిననూ ఎదుటివారికి ఇబ్బంది కల్గి నట్లుగా ఉండును. కనుక వీలైనంతవరకు కఠిన మరియు హాస్యవచనములను నియంత్రణలో ఉంచాలి. వాదనాశక్తిని అధికంగా చూపకూడదు.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో కనపడే చంద్ర, శుక్ర, కుజగ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో ఆర్థిక లావాదేవీల విషయంలోనూ, ప్రయాణాల విషయంలోను తగు తగు జాగ్రత్తలు తీసుకుంటూ, విచారణ పరిశీలన అవగాహనతో ఉండాల్సిన అవసరం ఉందని గుర్తుంచుకోవాలి.

మార్చి 25 ఉదయం 4.52 నుంచి 27 ఉదయం 9.37 వరకు,

ఏప్రిల్ 21 మధ్యాహ్నం 2.13 నుంచి 23 రాత్రి 7.53 వరకు,

మే 18 రాత్రి 10.07 నుంచి 21 ఉదయం 5.15 వరకు,

జూన్ 15 ఉదయం 4.24 నుంచి 17 మధ్యాహ్నం 12.41 వరకు పైన చెప్పిన అంశాలన్నింటిలోను జాగ్రత్తలు తీసుకుంటూ తగు విధి విధానంతో ఉండాలి. హడావిడిగా నిర్ణయాలు ఉండకూడదని గుర్తుంచుకోవాలి.

పై సమయాలలో తీసుకునే నిర్ణయాలు సముచితంగా ఉండాలే తప్ప, ఎదుటివారికి ఇబ్బంది కల్గే విధంగా ఉండకూడదని గ్రహించాలి. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా పైన చెప్పిన అంశాలపై మరింత సానుకూలంగా అవకాశాలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పొందటానికై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి పాటించటానికి ప్రయత్నం చేయగలరు.




7వ పేజీలో
సింహరాశి వారికి
జాగ్రత్తలు



# గార్గేయం



## సింహరాశి

( మఘ 1,2,3,4 పుబ్బ 1,2,3,4 ఉత్తర 1 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు.కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా నాల్గుమాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో సింహరాశి వారు మానసిక, శారీరక అంశాలన్నింటినీ గుర్తుంచుకుని తగినవిధంగా స్పందించాల్సిన అవసరం ఉంది. శరీర బలహీనత తగ్గటము లేక మృదుత్వం తగ్గటము, లేక శరీరము కఠినముగా తయారు కావటము, పుష్టిగా ఉన్న శరీరము తగ్గటము, స్వల్పంగా కాంతివిహీనం కావటము,ఏదైనా సమస్య వలన అవయవలోపములు ఏర్పడటము, అవయవ బలహీనతలు మొదలగు విషయాలలో తగు తగు జాగ్రత్తలు తీసుకోవాలి. వాహనం నడిపినప్పుడు అప్రమత్తంగా ఉండాలి. వ్యక్తిగత ఆకర్షణలకు గురైనప్పుడు సమస్యలు లేకుండా చూసుకోవాలి. వ్యక్తిగత గౌరవము, ప్రాధాన్యత, చలాకీతనము,వందనీయత మొదలగు అంశాలలో తేడాలు రాకుండా జాగ్రత్త పడాలి. ఒక్కోసారి అనుకోకుండా ఆగ్రహం చెందినందున సమస్యలు రాగల అవకాశముంటుంది. రోగనిరోధక శక్తి తగ్గుదలకు సూచనలున్నవి. కేశములు అనుకోకుండా రాలిపోవటము, శారీరక సుఖము కోల్పోవటము మొదలైన సమస్యలకు అవకాశములున్నవి. కనుక సింహరాశి జాతకులు వీటిని గుర్తించి తగు కారణములు తెలుసుకుని, వీలైనంతవరకు ప్రతికూలతలు లేకుండా చూసుకోవటానికి ప్రయత్నం చేయాలి. అదేవిధంగా వివాహమైన వారు దంపత శతృత్వములు లేకుండా సామరస్య పూరితంగా ఉండటానికి ప్రయత్నం చేయాలి. తొందరపాటు మాటలు పనికిరావు. వివాహ, నిశ్చితార్థములకు సిద్ధంగా ఉన్నవారు ఆచితూచి సరియైన నిర్ణయాలు తీసుకొని అంగీకారం తెల్పాల్సిన అవసరముందని గ్రహించాలి.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో కనపడే చంద్ర, శుక్ర, కుజగ్రహాలను మనస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మరింత మెరుగైన ఆలోచనలను తెచ్చుకుని, సమస్యలు ఎక్కడ ఉన్నాయో అన్న విషయాన్ని గమనించి, లోపాలను గ్రహించి, ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నానికి పాటుపడాలి.

మార్చి 27 ఉదయం 9.37 నుంచి 29 మధ్యాహ్నం 11.39 వరకు, ఏప్రిల్ 23 రాత్రి 7.53 నుంచి 25 రాత్రి 9.55 వరకు, మే 21 ఉదయం 5.15 నుంచి 23 ఉదయం 8.24 వరకు, జూన్ 17 మధ్యాహ్నం 12.41 నుంచి 19 సాయంత్రం 5.27 వరకు పైన చెప్పిన అంశాలన్నింటిలో అధిక జాగ్రత్తలు తీసుకోవాలి. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా పైన చెప్పిన అంశాలపై మరింత సానుకూలంగా అవకాశాలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పొందటానికై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి పాటించటానికి ప్రయత్నం చేయగలరు.






8వ పేజీలో
కన్యారాశి వారికి
జాగ్రత్తలు

# గార్గేయం



## కన్యారాశి

( ఉత్తర 2,3,4 హస్త 1,2,3,4 చిత్ర 1,2 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో కన్యారాశివారికి లాభం లేని ఖర్చులు, అనవసర వ్యయములు అధికంగా ఉండును. పరోపకారం కోసంగా ఆర్థిక నష్టము. రాత్రి సమయాలలో నిద్ర తక్కువగా ఉండు సూచన ఉన్నది. తాత, నాయనమ్మలకు సంబంధించిన విషయాలలో జాగ్రత్తలు గైకొనాలి. ముఖ్యంగా పాదములు, నడక విషయంలో కూడా అధిక శ్రద్ధ చూపించాల్సిన అవసరం ఉన్నది. అంతేకాక శరీరంపై పదునుగా గాయములు తగిలే అవకాశం కలదు. పిన్ని మేనమామలతో సంబంధ బాంధవ్యాలు జాగ్రత్తగా నెరపాలి. వ్యాధి నిరోధక శక్తి తగ్గే అవకాశముంది. అనవసర ఋణములు, శత్రువులను దరికి రానివ్వకుండా జాగ్రత్త వహించాలి. కొన్ని సందర్భాలలో బొడ్డు దగ్గర కానీ, పొత్తికడుపులో గానీ ఏదైనా సమస్య ఉన్నచో తక్షణమే వైద్యున్ని సంప్రదించేది. కనుక కన్యారాశి జాతకులు పై అంశములను గుర్తించి వీలైనంత వరకు ప్రతికూల తలు రానీయకుండా అనుకూలతలు వచ్చేలా ప్రయత్నాలు చేసుకోవాలి. కొన్ని సందర్భాలలో కారణము లేకుండా ప్రతి కూలతలు ఉండును. కనుక ఈ నాల్గుమాసాలు సమయస్ఫూర్తితోనే ఉంటుండాలి. తొందరపాటు చర్యలను తగ్గించుకోవాలి.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో కనపడే చంద్ర, శుక్ర, కుజ గ్రహాలను మన స్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 2 సూర్యోదయానికి పూర్వము 3.16 నుంచి 4 ఉదయం 5.40 వరకు, తిరిగి మార్చి 29 మ11.39 నుంచి 31 మధ్యాహ్నం 12.32 వరకు ఏప్రిల్ 25 రాత్రి 9.55 నుంచి 27 రాత్రి 9.48 వరకు, మే 23 ఉదయం 8.24 నుంచి 25 ఉదయం 8.28 వరకు, జూన్ 19 సాయంత్రం 5.27 నుంచి 27 సాయంత్రం 6.46 వరకు ప్రతికూల సమయములుగా గుర్తించాలి. ఈ సమయాలలో మనసును చాంచల్యంగా ఉంచకుండా సూటిగా, స్పష్టంగా, సత్య వాక్కులతో తమ తమ పనులను సాగించుకునేది. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా పైన చెప్పిన అంశాలపై మరింత సానుకూలంగా అవకాశాలను ప్రత్యక్షంగా లేక పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.




9వ పేజీలో
తులారాశి వారికి
జాగ్రత్తలు



# గార్గేయం



## తులారాశి

( చిత్ర 3,4 స్వాతి 1,2,3,4 విశాఖ 1,2,3 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో తులారాశి వారు ఆస్తి, కీర్తి ప్రతిష్ఠలు, ఆదాయము ఇతర వృత్తి వ్యవహారాదులు, అలవాట్లు, వివేకము, అనుకూల స్థితిగతులు మొదలైన అన్నీ అంశాలలో ఆచితూచి అడుగులు వేస్తుండాలి. ఒక్కోసారి లబ్ధి రావల్సిన చోట దుర్లాభము కలగటము, కీర్తి ప్రతిష్ఠలకు భంగం కల్గి అజ్ఞానంతో వ్యవహరించిన కారణంగా సమస్యలు రాగల సూచన కలదు. అన్న, అక్క, చిన్నాన్న, అత్త, పెద్ద అల్లుడు, పెద్ద కోడలు,నాల్గవ సంతానం మొదలైన వారి విషయాలలో పట్టు విడుపులుంటూ సమస్యలు రాకుండా జాగ్రత్త పడాలి. కాలి పిక్కలకు ఏదేని ఇబ్బంది కల్గి బాధాకరంగా మారు సూచన ఉన్నది. కనుక వైద్య నిర్ణయాలకు ప్రాధాన్యత ఇవ్వాలి. జూదములు, లాటరీల జోలికి వెళ్లకూడదు. సంతాన విషయాలలో అధిక శ్రద్ధ ఉంచి వారికి అవసరమైన అంశాలన్నింటిలో సమస్యలు లేకుండా ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతూ ఉంటుండాలి. కనుక తులారాశి వారు పైన చెప్పిన అంశములన్నింటినీ గుర్తుంచుకొని సమస్యలు ఏర్పడటానికి ముందుగా కారణాలను తెలుసుకుని వీలైనంతవరకు ప్రతికూలతలు కలగకుండా అనుకూలతలు వచ్చేలా ప్రయత్నం చేయాలి. కనుక సామరస్య పూరితంగా పరిస్థితులన్నీ ఉండటాని కోసమై తొందరపాటు నిర్ణయాలు తీసుకొనరాదు. ఆచితూచి సరియైన సమయంలోనే సరియైన నిర్ణయాలు తీసుకొనటం అవసరం.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో సాయంత్రం 6.30 నుంచి రాత్రి 9.00 గంటల వరకు కనపడే చంద్ర, శుక్ర, కుజ గ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 4 ఉదయం 5.40 నుంచి 6 ఉదయం 8.21 వరకు, మార్చి 31 మధ్యాహ్నం 12.32 నుంచి ఏప్రిల్ 2 మధ్యాహ్నం 2.04 వరకు, తిరిగి ఏప్రిల్ 27 రాత్రి 9.48 నుంచి 29 రాత్రి 9.45 వరకు, మే 25 ఉదయం 8.28 నుంచి 27 ఉదయం 7.36 వరకు, జూన్ 21 సాయంత్రం 6.46 నుంచి 23 సాయంత్రం 6.19 వరకు ఉన్న సమయాలలో అధిక జాగ్రత్తలు తీసుకుంటూ కంకణ సూర్యగ్రహణ సందర్భంగా మరింత మెరుగైన అవకాశాలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.




10వ పేజీలో
వృశ్చికరాశి వారికి
జాగ్రత్తలు



# గార్గేయం



## వృశ్చికరాశి

( విశాఖ 4, అనూరాధ 1,2,3,4 జ్యేష్ఠ 1,2,3 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో వృశ్చికరాశి జాతకులు తాము ఆచరించే వృత్తి, ఉద్యోగం, వ్యాపారం, స్వయం ఉపాధి విషయాలలోను, పై అధికారులతోను, అత్తగారితోను మెలిగే విషయాలలో కొంత ప్రతికూలతలు ఉండబోతున్నవి. అలాగే పరువు ప్రతిష్ఠలకు, ఏదేని భంగం వాటిల్లే అవకాశం కూడా ఉన్నది. తమ యొక్క పాలనా శక్తియుక్తులతో ప్రశాంతంగా ఉన్నామనే ఆలోచన ఉన్నప్పటికీ తెలియని లోపములు ఎదురయ్యే అవకాశం ఉంది. అనుకోకుండా శాంత స్వభావులు కూడా ఒక్కో సమయంలో ఆగ్రహం చెందు సూచన కలదు. గృహనిర్మాణ రంగంలో ఉన్నవారు లేక గృహం నిర్మించాలనుకునే వారు, అద్దె ఇళ్లలో ఉన్నవారు, వాహన అంశాలలోను, ఆరోగ్య విషయాలలోను, పలు పలు జాగ్రత్తలు తీసుకుంటూ ఉండాలి. ఆందోళన చెందాల్సిన అవసరం ఏమీ లేదు. ఈ గ్రహణ ప్రభావం వలన సానుకూలతగా ఉండేవి కూడా అనుకోకుండా ప్రతికూలంగా మారే అవకాశం కలదు. కనుక అనుకూలప్రదంగా పరిస్థితులు ఉండుటకై హడావుడి నిర్ణయాలు తీసుకోరాదు.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో సాయంత్రం 6.30 నుంచి రాత్రి 9.00 గంటల వరకు కనపడే చంద్ర, శుక్ర, కుజ గ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 6 ఉదయం 8.21 నుంచి 8 మధ్యాహ్నం 11.58 వరకు, ఏప్రిల్ 2 మధ్యాహ్నం 2.04 నుంచి 5.24 వరకు మళ్లీ ఏప్రిల్ 29 రాత్రి 9.45 నుంచి మే 1 రాత్రి 11.36 వరకు తిరిగి మే 27 ఉదయం 7.36 నుంచి 29 ఉదయం 7.56 వరకు, జూన్ 23 సాయంత్రం 6.19 నుంచి 25 సాయంత్రం 6.04 వరకు ఉన్న సమయాలలో అధిక జాగ్రత్తలు తీసుకుంటూ కంకణ సూర్య గ్రహణ సందర్భంగా మెరుగైనటువంటి అవకాశాలనుల, ఆలోచనలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.

11వ పేజీలో ధనూరాశి వారికి జాగ్రత్తలు






# గార్గేయం



## ధనూరాశి

( మూల 1,2,3,4 పూర్వాషాఢ 1,2,3,4 ఉత్తరాషాఢ 1 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో ధనూరాశి వారు దూరప్రయాణాలు, పెద్దలు, తండ్రి, గురువు, దైవభక్తి, వైదిక ఆచారములు, ధనాదాయము, బంగారములు, చరాస్తులు, తీర్థయాత్రలు, యజ్ఞములు, హోమములు, వినయవిధేయతలు, వందనీయత మొదలగు అంశాలపై అధిక శ్రద్ధను ఉంచాలి. గ్రహణ ప్రభావం వలన పై అంశములలో లోపములు దొర్లు సూచన కలదు. మరదలు, బావ, తండ్రి ఆరోగ్యము, బావమరిది, మరిది, మూడవ సంతానము, మనుమడు లేక మనుమరాలు, తండ్రి మొదలగు బంధు వర్గీయులతో సంబంధ బాంధవ్యాలు జాగ్రత్తగా వహించాలి. శరీరములోని తొడల భాగమునకు ఏదైనా రుగ్మత వచ్చినచో వైద్యున్ని సంప్రదించేది. కనుక పైన చెప్పిన అంశములన్నింటిలో ఒక్కోసారి అనుకూలతలకు బదులుగా వ్యతిరేక వాతావరణం ఏర్పడినందున మానసిక ప్రశాంతత లోపించు అవకాశం గ్రహణ ప్రభావముచే ఉన్నది. కనుక పరిస్థితుల స్థితిగతులను గమనిస్తూ అనుకూలప్రదంగా పై అంశాలలో మెరుగుదలను సాధించుటకై తగు తగు నిర్ణయాలు తీసుకొనాలి.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో సాయంత్రం 6.30 నుంచి రాత్రి 9.00 గంటల వరకు కనపడే చంద్ర, శుక్ర, కుజ గ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 8 మధ్యాహ్నం 11.58 నుంచి 10 సాయంత్రం 4.59 వరకు, ఏప్రిల్ 4 సాయంత్రం 5.24 నుంచి 6 రాత్రి 11.00 వరకు, మే 1 రాత్రి 11.36 నుంచి 4 ఉదయం 4.29 వరకు, తిరిగి మే 29 ఉదయం 7.56 నుంచి 31 మధ్యాహ్నం 11.14 వరకు, జూన్ 25 సాయంత్రం 6.04 నుంచి 27 రాత్రి 7.58 వరకు ఉన్న సమయాలలో ఎక్కువ జాగ్రత్తలు తీసుకుంటూ, కంకణ సూర్యగ్రహణ సందర్భంగా వ్యతిరేకతలు లేకుండా అనుకూలతలు ప్రత్యక్షంగా, పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.

12వ పేజీలో మకరరాశి వారికి జాగ్రత్తలు






# గార్గేయం



## మకరరాశి

( ఉత్తరాషాఢ 2,3,4 శ్రవణం 1,2,3,4 ధనిష్ఠ 1,2 )

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో మకరరాశి జాతకులు వాహన చోదకము, మరియు వాహన ప్రయాణాలలో, కోర్టు వ్యవహారములలో అధిక జాగ్రత్తలు తీసుకోవాలి. అన్యాయము, అక్రమము, అవినీతిని ఎదిరించే సందర్భాలలో అధిక జాగ్రత్త అవసరము. తెలియకుండానే ఆకస్మికంగా ఆర్థిక లావాదేవీలు అప్రయత్నంగా దారిమళ్లు సూచన కలదు. మొత్తం మీద ఈ కంకణ సూర్యగ్రహణ ప్రభావంచే మకరరాశి వారికి పైన చెప్పిన అంశములతో పాటు ఇతర శరీర అవయవాలలో లోపములు ఏర్పడి వైద్యుల నిర్ణయాలు కూడా తీసుకునే అవకాశం ఉన్నది. ఎదుటివారితో సంభాషించే సమయంలో వాక్ స్థానాన్ని నియంత్రించుకోవాలి. అలాగే ఆర్థిక, కుటుంబ, నేత్ర, దంత విషయాలలో కూడా అధిక శ్రద్ధ చూపాలి.ఏది ఏమైనప్పటికీ పరిస్థితులు వ్యతిరేకంగా ఉన్నప్పుడు వాటిని తట్టుకుని నిలబడి అను కూలతను పొందే దిశగా జాతకుడు ప్రయత్నం చేయాలి.

ఈ కారణంగా మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో సాయంత్రం 6.30 నుంచి రాత్రి 9.00 గంటల వరకు కనపడే చంద్ర,శుక్ర, కుజ గ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 10 సాయంత్రం 4.59 నుంచి 12 రాత్రి 11.56 వరకు,
ఏప్రిల్ 6 రాత్రి 11.00 నుంచి 9 ఉదయం 6.53 వరకు,
మే 5 ఉదయం 4.29 నుంచి 6 మధ్యాహ్నం 12.33 వరకు, తిరిగి
మే 31 మధ్యాహ్నం 11.14 నుంచి జూన్ 2 సాయంత్రం 6.22 వరకు మళ్లీ
జూన్ 27 రాత్రి 7.56 నుంచి 29 అర్ధరాత్రి తదుపరి 1.37 వరకు ఉన్న సమయాలలో పైన చెప్పిన అంశాలన్నింటిలోను దృష్టి అధికంగా ఉంచాలి. సామరస్య పూర్వకంగా దృష్టిని నిలపాలని తెలుసుకోవాలి. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా వ్యతిరేకతలు లేకుండా అనుకూలతలు ప్రత్యక్షంగా, పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.




13వ పేజీలో
కుంభరాశి వారికి
జాగ్రత్తలు



# గార్గేయం



## కుంభరాశి

(ధనిష్ఠ 3,4, శతభిషం 1,2,3,4 పూర్వాభాద్ర 1,2,3)

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో కుంభరాశి జాతకులకి వ్యాపార భాగస్వామ్యములు, కుటుంబ భాగస్వామ్యములు, వివాహము, వివాహజీవితము, ఆలస్య వివాహములు, ఆహారవిహారములు, నిద్రాసౌఖ్యములు, అకాలభోజనములు, అకాలములో నిద్రపోవుట, సుగుణములు, అందము, ప్రవర్తన మరియు రెండవ సంతాన స్థితిగతులతో పాటు, ఆరోగ్య విషయంలో కూడా అత్యధిక శ్రద్ధ చూపిస్తుండాలి. అనగా కంకణ సూర్యగ్రహణ ప్రభావము పై అంశములలో అనుకూలతలకు బదులుగా వ్యతిరేకతలు రాగల అవకశామున్నది. అంటే ఉదాహరణకు భాగస్వామ్యుల మధ్య తెలియని శతృత్వములతో పొరపొచ్చాలు వచ్చి మనస్పర్థలు అధికమయ్యే అవకాశం కలదు. కనుక కుంభరాశి జాతకులు ఈ అంశములన్నింటినీ గుర్తుంచుకుని వ్యతిరేకతలను దరికిరానీయకుండా సమయ స్ఫూర్తిగా నిర్ణయాలు తీసుకుంటూ పావులను కదపాలి.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో సాయంత్రం 6.30 నుంచి రాత్రి 9.00 గంటల వరకు కనపడే చంద్ర, శుక్ర, కుజ గ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 12 రాత్రి 11.56 నుంచి 15 ఉదయం 9.11 వరకు,

ఏప్రిల్ 9 ఉదయం 6.53 నుంచి 11 సాయంత్రం 4.40 వరకు,

మే 6 మధ్యాహ్నం 12.33 నుంచి 8 రాత్రి 10.53 వరకు,

జూన్ 2 సాయంత్రం 6.22 నుంచి 5 ఉదయం 4.36 వరకు ఉన్న సమయాలలో పైన చెప్పిన అంశాలలో వ్యతిరేకతలు ఉన్నాయేమో గమనిస్తూ సమయస్ఫూర్తిగా వ్యవహరిస్తూ పావులు కదపాలి. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా వ్యతిరేకతలు లేకుండా అనుకూలతలు ప్రత్యక్షంగా, పరోక్షంగా పొందుటకై 15వ పేజీలో చెప్పబడే ఓ చక్కని పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.




14వ పేజీలో
మీనరాశి వారికి
జాగ్రత్తలు



# గార్గేయం



## మీనరాశి

(పూర్వాభాద్ర4, ఉత్తరాభాద్ర 1,2,3,4 రేవతి 1,2,3,4)

## 2017 ఫిబ్రవరి 26 కంకణ సూర్యగ్రహణం సందర్భంగా

2017 ఫిబ్రవరి 26 ఖగోళంలో సంభవించే కంకణ సూర్యగ్రహణం భారతదేశంలో కనపడదు. కానీ దీని ప్రభావం మాత్రం ప్రపంచ వ్యాప్తంగా 4 మాసాల పాటు ఉంటుంది. ఈ నేపథ్యంలో మీనరాశి వారికి అనవసర శతృవులు, రుగ్మతలు, ఋణములు, వ్రణములు అధికమయ్యే అవకాశం కలదు. ఒక్కోసారి అనుకోకుండా శరీరంపైన కాలిన బొబ్బలు కానీ లేక ఇతర ప్రమాదవశాత్తు దెబ్బలు లేదా పాదములకు సమస్యలు మొదలైనవి రాగల అవకాశమున్నది. మేనమామ, తాత, నాయనమ్మ, పినతల్లులతో సంబంధ బాంధవ్యాలలో జాగ్రత్తగా మెలగాలి. అనవసర ఖర్చులు, లాభం లేని ఖర్చులు, నిద్రలేమి ఉండి ఒక్కోసారి వ్యాధి నిరోధకశక్తి కూడా తగ్గు సూచన కలదు. శతృవులు కూడా అనుకోకుండా వృద్ధి కాగల అవకాశమున్నది. బొడ్డు లేదా పొత్తి కడుపులోని అవయములకు అనుకోకుండా రుగ్మత వచ్చినచో తక్షణం వైద్యున్ని సంప్రదించేది. మొత్తం మీద పై సమస్యలు వచ్చినప్పుడు చాలా జాగ్రత్తలతో, సమయస్ఫూర్తితో సంభాషిస్తూ, తగిన రీతిలో పరిష్కారం చేసుకొనుటకు ప్రయత్నించాలి.

ఏది ఏమైనప్పటికీ మార్చి 1 రాత్రికి పడమర దిక్కులో సాయంత్రం 6.30 నుంచి రాత్రి 9.00 గంటల వరకు కనపడే చంద్ర, శుక్ర, కుజ గ్రహాలను మనఃస్ఫూర్తిగా వీక్షించి శ్రీ లలితా పరమేశ్వరిని ధ్యానించండి. ఈ క్రింద ఉదహరించిన తేదీలలో మెరుగైన ఆలోచనలను చేయండి. ఎక్కడెక్కడ సమస్యలు ఉన్నాయన్న విషయాలని గమనించి లోపాలను తెలుసుకుని ప్రతికూలతలను తగ్గించే ప్రయత్నాలకు పాటుపడండి.

2017 మార్చి 15 ఉదయం 9.11 నుంచి 17 రాత్రి 8.38 వరకు,

ఏప్రిల్ 11 సాయంత్రం 4.40 నుంచి 14 ఉదయం 4.06 వరకు,

మే 8 రాత్రి 10.53 నుంచి 11 ఉదయం 10.35 వరకు,

జూన్ 5 ఉదయం 4.36 నుంచి 7 సాయంత్రం 4.36 వరకు ఉన్నటువంటి సమయాలలో తీసుకునే నిర్ణయాలు చాలా సముచితంగా ఉండాలని తెలుసుకోవాలి. కంకణ సూర్యగ్రహణ సందర్భంగా పైన చెప్పిన అంశాల ద్వారా వ్యతిరేకతలు రాకుండా అనుకూల ప్రదంగా లబ్ధిని పరోక్షంగా గానీ లేక ప్రత్యక్షంగా గానీ పొందుటకు తదుపరి పేజీలో చెప్పబడే ఓ పరిహారమును గమనించి, పాటించటానికి ప్రయత్నం చేయగలరు.




15వ పేజీలో
పరిహారము





# గార్గేయం



## 15వ పేజీ

## పరిహారం

ఫిబ్రవరి 26 నాటి గ్రహణం జరిగిన 72 గంటలలో పడమర దిశలో చంద్రుడు, శుక్రుడు, కుజుడు రేవతి నక్షత్రంలో ముక్కోణాకారంలో సాధారణ కన్నులకు దర్శనమివ్వటం జరుగును. మహాసౌరయోగము, సర్వార్థ సిద్ధి యోగము అనే రెండు యోగాల నడుమ బుధ నక్షత్రమైన రేవతిలో, శుక్రుడు ఉచ్ఛ స్థానంలో దర్శనం ఇవ్వనున్నాడు. కనుక గ్రహణం భారతదేశంలో కనపడకపోయినప్పటికీ ద్వాదశరాశుల వారు మార్చి 1 సాయంత్రం సూర్యుడు అస్తమించిన తర్వాత క్రింది సమయాలలో పడమర దిశలో సాధారణ కన్నులతో ఈ 3 గ్రహాలని వీక్షించండి.

అయితే ఈ వీక్షించే ముందు ఏదో ఒక తీపిపదార్థాన్ని కొంచమైనా చాలు, కుడిచేతిలో ఉంచుకొని, మూడు గ్రహాలకు ఎదురుగా కనపడేలా ఎడమచేతిలో కుడిచేయి ఉంచుకుని, భక్తి విశ్వాసాలతో ఈ మూడు గ్రహాలుగా ఉన్న ముక్కోణం మధ్యలో శ్రీ లలితా పరమేశ్వరి పద్మాసనంతో కూర్చున్నట్లుగా భావిస్తూ.. శుక్ర, చంద్ర, కుజులని పరిపూర్ణ విశ్వాసంతో దర్శించండి. అవకాశమున్నవారు శ్రీలలితా దేవి నామాలలో కొన్ని నామాలను మనఃపూర్వకంగా చదువుకోవటానికి ప్రయత్నం చేయండి. లేనివారు ఓం శ్రీమాత్రే నమః అనుకొనండి.

తదుపరి అరచేతిలో ఉన్న తీపి పదార్థాన్ని కనులకు అద్దుకుని ప్రసాదంగా స్వీకరించండి. అదే ప్రసాదాన్ని కుటుంబంలోని ఇతర సభ్యులకు కూడా పంచుటకు ప్రయత్నించండి. ఇతర ఎలాంటి నియమాలు ఏమీ లేవు. ఈ దిగువ ఇచ్చిన ప్రాంతాలలో ఆ సమయాలలోనే కనపడును. ఆ ప్రాంతాలకు సమీపంలో ఉన్న వారు కూడా, ఆయా సమయాలకు అనుగుణ్యంగా దర్శించుకోవటానికి ప్రయత్నించండి.

హైద్రాబాద్- సా6.19 నుంచి 9.04 వరకు, విజయవాడ- సా6.10 నుంచి రా8.55 వరకు,
తిరుపతి- సా6.15 నుంచి రా8.59 వరకు, విశాఖపట్నం - సా5.59 నుంచి రా8.44 వరకు,
చెన్నై - సా6.14 నుంచి రా8.55 వరకు, బెంగుళూరు - సా6.25 నుంచి రా9.06 వరకు,
షిర్డీ - సా6.33 నుంచి రా9.21 వరకు, ఢిల్లీ- సా6.17 నుంచి రా9.13 వరకు...
ఈ ప్రాంతాలకు చుట్టుప్రక్కల ఉన్నటువంటి వారు ఈ సమయాలకు అటు ఇటులో చూసుకొనుటకు ప్రయత్నించండి.
మీ బంధు మిత్రాదులకు షేర్ చేయండి.




## దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ

భారత ప్రభుత్వ ఆమోదగణిత పంచాంగకర్త


గమనిక - ప్రతి ఆదివారం ఉదయం 8 గంటల నుంచి 9 గంటల వరకు స్టూడియో ఎన్ శాటిలైట్ ఛానల్‌లోను, ప్రతిరోజు ఉదయం 7.00 నుంచి 8.00 గంటల వరకు యోగి శాటిలైట్ ఛానల్‌లోను 'గార్గేయం' ఎక్స్‌క్లూజివ్ లైవ్‌షోలో జ్యోతిష అంశాలను తెలుసుకోవటానికి ప్రయత్నించండి.

0883 - 246 2565
903 246 2565

mohan PUBLICATIONS

మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

